

## మౌలానా మహమ్మద్ మసూది

మౌలానా మహమ్మద్ సయద్ మసూదీ గారు ఉర్దూ, అరబిక్, పర్షియన్ భాషల్లో ఉపాధ్యాయులుగా జీవనం ఆరంభించారు. ఈ భాషల్లో విస్తృత పాండిత్యానికి వీరు ప్రసిద్ధులుగా గణనకెక్కారు.

1931లో కాశ్మీరు, జమ్మూ సంస్థాన ప్రజలు సంస్థానాధీశ్వరుని నిరంకుశత్వాన్ని మొదటిసారిగా ప్రతిఘటించటానికి పూనుకున్నప్పుడు, వీరు రాజకీయాల్లో ప్రవేశించారు. ఇది వీరి జీవితంలో చరిత్రాత్మకమైన సంఘటన. నిరంకుశాధి

—See inside back cover

## ముస్లిం ప్రముఖుడు కనుగొనిన వృత్తాంతము

మౌలానా మసౌదీ (జమ్మూ, కాశ్మీర్): రాష్ట్రపతి ప్రసంగానికి బలపరచు సమయంకోసం నేను నిలుచున్నాను. కాశ్మీర్ సమస్య పట్లా, ఇద్వారా పాకిస్తాన్ చేస్తున్న బెదిరింపుల పట్లా స్థిరమైన వైఖరి అవలంబించి బయటపెడుతున్న రాష్ట్రపతి ప్రసంగం సూచిస్తున్నందుకు నాకు సంతోషకరంగా ఉన్నది. ప్రస్తుతం ఎంతో యింతో పెద్ద దేశమే అయిన పాకిస్తాన్ అవతరణ నిజానికి మహనీయమైన త్యాగాల ఫలితంగా గాని, ఓరోచిత సాహస చర్యలంగా గాని జరగలేదు. పాకిస్తాన్ ఆయుధం, దాని సమగ్ర చరిత్ర పరిశీలిస్తే, దాని మనుగడ బెదిరింపులమీద, ఉత్త బెదిరింపులమీదనే ఆధారపడి ఉందని తెలుస్తుంది. బెదిరింపుల ఫలితంగానే జననమందిన పాకిస్తాన్, బెదిరింపుల సహాయంతోనే బతకడానికి నిశ్చయించుకున్నది. దాని యిరుగు పొరుగు దేశాలు—ముఖ్యంగా ఇండియా—బెదిరింపులకు లొంగిపోతే ఇక కష్టాలు ఉండవనుకున్నది ఉండదు. ఎంతో అతిశయోక్తిపూరితమైన ప్రచారంతో కాశ్మీర్ సమస్యను ప్రపంచానికి ప్రదర్శిస్తున్నది పాకిస్తాన్. అయితే ఒక్కటి: బయటి ప్రపంచానికి పాకిస్తాన్ చూపిస్తున్న యీ సమస్య స్వరూపం వేరు: స్వదేశ ప్రజల కుథ్య చేస్తున్న ప్రచారం వేరు. నలభై లక్షల నిస్సహాయ ప్రజలు పీడకుల చేతుల్లో పడి పీడింపబడుతున్నారని, వారిని విముక్తుల్ని చేసే బాధ్యత ఒక్క పాకిస్తాన్ పైననే ఉన్నదని బయట ప్రపంచానికి ఎలుగెత్తి చాటుతూ, కాశ్మీర్ సమస్యగురించి స్వదేశ ప్రజలకు వివరించవలసి వచ్చినప్పుడు మాత్రం యీ విధంగా అంటున్నది: "కాశ్మీర్ లేనిదే మీరు బతకలేరు. కాశ్మీర్ మనకి దక్కనినాడు, అసలు పాకిస్తాన్ అన్నదే హరించిపోక

తప్పదు." ఈ రెండు వాక్యాలలోనూ దేంట్లోనూ నిజం లేదు. అసలు సత్యం ఏమిటంటే, పాకిస్తాన్ యొక్క ప్రస్తుతపు నాయక వర్గం, అధికారంలో ఉన్న పార్టీ రెండూ తమ స్వార్ధ ఆశయాలవల్ల, తప్పుడు రాజకీయాలవల్ల, ప్రజల ఆదరణ పూర్తిగా కోల్పోయాయి.

పాకిస్తాన్‌లోని పట్టణాలను స్వయంగా చూసి రావడానికి అవకాశం కలిగినవాళ్లు అలా చూసి వచ్చి, తెలుసుకొని మనకు చెపుతున్నదాన్ని బట్టి, నేడు అమలో ఉన్న అన్ని ప్రభుత్వాలలోకీ ప్రజానిరసన ఎక్కువగా పొందుతున్న ప్రభుత్వం ఏదంటే—పాకిస్తాన్‌లోని లీగ్ ప్రభుత్వమేనని తేలుటన్నది. అక్కడికి బహుదూరంగా ఉన్న యీ స్థలంలోఉండి—అక్కడనుండి మనకు వినవస్తున్న విషయాలు—సైన్యంలో తరుచు జరిగే కుట్రలు, అక్కడి ప్రజల ప్రస్తుత మన స్థితి వివిధ పార్టీల నినాదాలు—వీటన్నిటినుండీ మనం గ్రహించ వలసినది ఏదయినా ఉన్నదా అంటే, ఉన్నది : అది యిది : ప్రస్తుతం అక్కడ పదవిలో ఉన్న ముఠా కుట్రలూ, కుహకాలవల్లనే పదవి కాపాడుకుంటోంది గాని ప్రజాసేవద్వారా కాదు ; ప్రజాదరణవల్ల అసలే కాదు. ఒక్క విషయం చూడండి, యీ సత్యం రుజువు చెయ్యడానికి యిప్పటికి అయిదు సంవత్సరాలు గడిచిపోయినా ఇంకా ప్రజలకు ఒక రాజ్యాంగ చట్టం అన్నది నామమాత్రంగానైనా అందించడానికి ధైర్యం చెయ్యలేకండా ఉన్నారు. ప్రజల మధ్య వారికి పలుకుబడి లేదనడానికి యింతకన్న నిదర్శనం ఏంకావాలి ? ఈ ధైర్యం లోపించడానికి కారణం ఉంది : ఇదివరకిటి నినాదాల ద్వారా ప్రజలకు వాగ్దానం చేసినది కాదు, యిప్పుడు వాళ్లు ప్రజలకు యివ్వదలచుకున్నది. ప్రజానీకం కోరుతున్నది మాత్రం వాళ్ల అవసరాలు తీర్చేదికాదు. ఈ విధంగా అతి ముఖ్యమైన రాజ్యాంగ నిర్మాణం కూడా ఏదో నెపాన వాయిదా వేయబడుతూనే వస్తున్నది. ఇంక ఏ యితర విషయం తీసుకున్నా, వారి వైఖరి యిదే విధంగా ఉన్నది, వాళ్ల పార్టీ విచ్ఛిన్నమై కూలిపోకండా నిలబెట్ట

డానికి యివాళ వాళ్ళకి మిగిలిన నినాదం కాశ్మీర్ సమస్య ఒక్కటే. ప్రజానీకం చేతులు కలిపి వాళ్ళకు యిష్టమై ఎన్నుకున్న ప్రభుత్వాన్ని ప్రతిష్ఠించడానికి ప్రస్తుతపు పార్టీని పదవినుండి దించెయ్యడానికి ప్రయత్నించినప్పుడల్లా, యీ ముఠావాళ్లు కాశ్మీర్ " బూచి " ని చూపిస్తూ, ప్రజలు యిప్పుడు ఏ మార్పు తలపెట్టినా కాశ్మీర్ వ్యవహారం చెడుతుందని బెదిరిస్తున్నారు. ఇంకొ పక్క కాశ్మీర్ పేరుచెప్పి కొన్ని విదేశ ప్రభుత్వాల మద్దతుకోసం ప్రయత్నిస్తున్నారు. ఆసియా రాజ్యాల పురోభివృద్ధిని అడుగడుగునా అరికట్టడానికి ప్రయత్నిస్తూన్న సమ్రాజ్యవాద దేశాలు ఉండనే ఉన్నాయి. ఇంకా నేడు కూడా ఆ దేశాలు మేలుకుంటున్న ఆసియా అభ్యుదయం చూడలేకండా ఉన్నారు. కాశ్మీర్ పేరుచెప్పి పాకిస్తాన్ యీ సామ్రాజ్యవాద దేశాలను ఉపయోగించుకుంటున్నది. ఈ విధంగా కాశ్మీర్ రెండు విధాల మోసాన్ని నడిపిస్తున్నది. ఈ పతంగం అంతటిలోనూ పాకిస్తాన్ లవలంబిస్తున్న పద్ధతికి మూల సూత్రం ఒక్కటే : బెదిరింపుట, కేవలం బెదిరింపుట. క్రిందటిసారి యీ బెదిరింపు పద్ధతి ప్రయోగించినప్పుడు ఎలా లాభించిందో, యిప్పుడూ అలాగే లాభిస్తుందని వారి అంచనా. కోట్లాటటా కొత్యటా చెలోగుతాయని బెదరింపు ; రక్తపాతం జరుగుతుందని, పాకిస్తాన్ నిర్మాణానికి ఒప్పుకోకపోతే దేశంలో రక్తం కాలువలై ప్రవహిస్తుందని బెదిరింపు. ఒత్తిడికి లొంగిపోయి కాంగ్రెస్ వాళ్ల కోర్కె అంగీకరించింది. కాని రక్తపాతం, సర్వనాశనం, హత్యలు, దోపిడీలు, అప్పుడు జరిగినదానికంటె ఎక్కువగా జరిగి ఉండేవా ఒకవేళ విభజనకు అంగీకరించని పక్షంలో ? ఈ సంగతి అప్పుడెవరికీ స్ఫురించక పోవడం వల్ల, అప్పట్లో బెదిరింపు ఫలించడం వల్ల యిప్పుడుకూడా ఆ బెదిరింపు సిద్ధాంతిన్నే ఉపయోగించుకుని పనుల నెరవేర్చుకుందికి ప్రయత్నిస్తున్నారు. కాని ఎప్పుడైతే ఇండియా ప్రభుత్వం తన విధ్యుక్త ధర్మాన్ని గుర్తించి, బెదిరింపులకు లొంగక రక్షణసైన్యాలను సరిహద్దుకు యివతల యిరవై

మైళ్ళ దూరంలో నిలిపి ఉంచిందో పాకిస్తాన్ బెదిరింపు కార్యరూపం దాల్చ డానికి వ్యవధిలేకపోయి, బెదిరింపు కేవలం బెదిరింపుగానే నిలిచిపోయింది. బిగించిన పిడికిలి చూపించడం మొదలు పెట్టినవాళ్ళంతా ఆ పిడికిలికి సమా దానంగా తన్నులు తగలవచ్చునని ఎప్పుడైతే గ్రహించారో వెనువెంటనే వారి విభ్రాంతి తొలగిపోయింది. ఇండియా ప్రభుత్వం ప్రస్తుతం తీసు కున్న విధానానికి నా అభినందనలు తెల్పుతున్నాను. ఇదేవిధానాన్ని సర్వదా అవలంబించమని నా అభిమతం. ఒక్క కాశ్మీర్ సమస్య విష యంలోనే కాక ఇండియా—పాకిస్తాన్ దేశాల మధ్య సమస్యలుగా ఉండి పరిష్కారం కోరుతున్న తూర్పు బెంగాల్ మొదలయిన అన్ని సమస్యల పట్లా యిటువంటి వైఖరి అవలంబించడమే అవసరం.

ఇండియా ప్రభుత్వానికి ఒక్క విషయం జ్ఞాపకం చేస్తున్నాను. ఇండియా రక్షణ సైన్యాలు కాశ్మీర్‌లో ప్రవేశించిన సమయంలో గౌరవనీ యులైన ప్రధాన మంత్రి నవంబరు 11, 1947 న బారామూలాలో ప్రసం గిస్తూ, దుండగీడల బారినుండి కాశ్మీర్ భూభాగంలోని ప్రతి అంగుళం నేలనూ తప్పించేవరకూ ఇండియా ప్రభుత్వం విశ్రమించదని అక్కడి ప్రజలకు హామీ యిచ్చారు. నే నిప్పుడు మీకు జ్ఞాపకం చెయ్యదలుచు కున్నదేమిటంటే, కాశ్మీర్ భూభాగంలో మూడవ వంతు ప్రజానీకంలో నాలుగవవంతు—నిస్సందేహంగా ఇండియాలో భాగాలు—ఇంకా దుండగీండ్ల దోపిడీగాండ్ల చేతులలోనే ఉన్నవి. కాశ్మీర్ ఇండియా గడ్డలో ఒకభాగమే నని కాశ్మీరు ప్రజలు నిర్ణయించారు. ఇంకో విధమైన నిర్ణయం ఏమున్నది కనక ? అనాదినుండీ కాశ్మీర్ యీ దేశంలో భాగంగానే ఉన్నదని యీ దేశచరిత్ర నిరూపిస్తున్నది. ఈ నాటికి కాశ్మీర్‌ను ఇండియానుండి విడ దీయాలని ప్రయత్నం జరుగుతున్నది. అటువంటి ప్రయత్నాన్ని ప్రతి ఘటించడం మాకు అత్యంత ప్రధానమైన ప్రాథమిక కర్తవ్యం. మీరు ఒక్కసంగతి తెలుసుకోవలసి ఉంటుంది : యుద్ధవిరమణ సరిహద్దుకు

అవతల ఉన్న ప్రజల పరిస్థితి బానిసల స్థితికన్నా నికృష్టంగా ఉన్నది. దురదృష్ట వశాత్తూ "ముస్లిమేతరులు" అని పిలవబడేవారు దుస్సహమైన వెట్టి బతుకు గడపడమే కాక "ముస్లిములు" అని పిలువబడేవారు సైతం అదే బాధకు లోనవుతున్నారు. నేను యిదే ఒక సవాల్ చేస్తున్నాను: పాక్షికమైన ప్లెబిసైట్ ద్వారానే సమస్య పరిష్కారం చెయ్య దలచుకుంటే, యుద్ధవిరమణ సరిహద్దుకు అవతల ఉన్న ప్రజల అభిప్రాయ ప్రకటన ప్రకారమే నిర్ణయాలు నడిపించండి. ఆ ప్రాంతంనుండి అన్నిరకాల సేనలనూ (రెగ్యులర్ సేనలు, ఇర్రెగులర్ సేనలూ) పాకిస్తాన్ ఉపసంహరించి అక్కడి ప్రజల అభిప్రాయం తీసుకోడానికి అవకాశం కల్గించిన పక్షాన, ఆ ప్రజాభిప్రాయానికి నేను బద్ధుడనై ఉంటాను. అక్కడి ప్రజల నిర్ణయం ఏ రకంగా ఉన్నా మేము అంగీకరిస్తాము. యుద్ధ విరమణ సరిహద్దుకు అవతల ఉన్న ప్రజలలో నూటికి తొంభై అయిదుగురు మాకు అనుకూలంగా వోటు చేస్తారని మాకు తెలుసు. ఇక సరిహద్దుకు యివతల ఉన్న ప్రజల పరిస్థితి సంగతి యిది: ఇక్కడ రాజ్యాంగ పరిషత్తుకు జరుగనున్న ఎన్నికలలో వచ్చి బాహాటంగా పాల్గొని మాతో పోటీ చేయమని మేము పాకిస్తాన్‌నూ, ఆ దేశానికి అండగా నిలుచున్న వారినీ, పదే పదే సవాల్ చేశాము. ఇది బాహాటమైన పద్ధతి వారికి అందుబాటులో ఉంది, కావలస్తే. వాళ్లకి యిష్టమైన నియోజకవర్గంలో, వాళ్లకి యిష్టమైన అభ్యర్థున్ని నిలబెట్టి ఎన్నికలలో పోటీ చెయ్యవచ్చు. ఈ ఎన్నికల పోటీ పరిశీలించడానికి కావలస్తే ప్రస్తుతపు ఐక్య రాజ్య సమితి పరిశీలకులను నియమించవచ్చు. ఇంతకూ "పరోక్షమైన ఒత్తిడి" అన్నది అంత పూర్తిగా ఎవరికీ తెలియకుండా, దాచి ఉంచడం అసంభవం. అక్రమమైన ఒత్తిడి ప్రజలపై తీసుకురావలంటే, సైన్యాన్ని గాని, పోలీసుల్నిగాని ఉపయోగించాలి; లేదా ఆయుదాలను చూపి బెదిరించాలి. చూడదలచుకుంటే, రండి, ఎవరైనా సరే. అక్రమమైన ఒత్తిడి కొంచెమైనా ఉన్న

దేమో చూడండి. రాజ్యాంగ పరిషత్తుకు జరుగనున్న ఎన్నికలు ఏ రక మైన ఒత్తిడితోనైనా జరపబడుతున్నాయేమో చూసి తేల్చుకోవడం అంత కష్టమైన పనికాదు. కాని, మేము చేస్తున్న సవాల్ అందుకోవడానికి వాళ్లకి దమ్ములు లేవు. ఎంచేతంటే, అంతర్యంలో వాళ్లకీ తెలుసు—ముస్లిములంతా నూటికి నూరుపాళ్లు షేక్ అబ్దుల్లా వెనక ఉన్నారని ఇక ముస్లిమేతరుల సంగతి అంటే, పాకిస్తాన్‌కు సహాయకరమైన విధంగా వాళ్లెన్నడూ ప్రవర్తించరు. వాళ్లకి పాకిస్తాన్‌లో తమప్రాణానికి హామీ లేదు ; ఆస్థికి రక్షణ వేరు ; గౌరవానికి చోటు వేరు. ఆదేశం పేరు పవిత్రమైన ఇస్లాం మతానికే కళంకం : అంతేకాదు : మానవత్వానికే కళంకం. ఈ యిరవైయో శతాబ్దపు ఉత్తర భాగంలో—తన మత నమ్మకాల కారణంగా తన ప్రాణాన్నీ ఆస్థినీ గౌరవాన్నీ కాపాడుకోలేని వ్యక్తులు ప్రపంచంలోని ఏ ప్రభుత్వపు హయాంలోనూ లేరు. పాకిస్తాన్‌లో యిటువంటి దురాగతాలు జరుగుతున్నాయని అంగీకరిస్తూ, అందుకు ముస్లిమునైన నేను ఎంతో సిగ్గుపడుతున్నాను. పాకిస్తాన్‌లోని ఎనిమిది కోట్ల ముస్లిములను సిగ్గుపాలు చేసినది యీ ముస్లిం లీగ్ వక్రనాయకత్వం. ఇస్లామ్ మతావలంబకులైన అక్కడి ప్రజలంతా చెడ్డవారని ఎవరనగలరు? —వారిలోనూ సన్మార్గులు ఉంటారు. కాని, యివాళ వాళ్ల నాయకుల దుశ్చర్యల ఫలితంగా వీరి నిర్మలమైన పేరుకూడా కలుషితం అవుతున్నది. అది సరే అలా ఉంచుతాం. ఇంతకూ నేను యిందాక మనవిచేశాను: జరుగనున్న రాజ్యాంగ పరిషత్తుకు ఎన్నికలు సంపూర్ణంగా నిష్పాక్షికంగా ఉంటాయని మేము ప్రకటించే ఉన్నాము. పద్దెనిమిది లక్షల వోటర్లు అందులో పాల్గొననున్నారు. గమనార్హమైన కాకతాళీయం ఏమంటే—ఇండియాలో పద్దెనిమిది కోట్ల వోటర్లు ఎన్నికలలో పాల్గొన నుంటే, కాశ్మీర్‌లో పద్దెనిమిది లక్షల వోటర్లు పాల్గొననున్నారు. ఇది చాలా పెద్ద ఎత్తున జరగవలసిన విషయం. దీనిని మరుగుపరచడం గాని, మభ్యపెట్టడం

గాని, ఏవిధంగా సాధ్యం అవుతుంది ? ఇక గౌరవనీయుడైన నా మిత్రుడు డాక్టరు గ్రాహాం సంగతి. అయన యింకేమీ ప్రయోజనకరమైన పని చెయ్యలేని పక్షంలో (చెయ్యలేడని మనకు రుజువు అవనే అయింది) కనీసం ఎన్నికలు జరిగే సమయంలో శ్రీ నగర్‌లో ఉండడం చెయ్యవచ్చు. అప్పుడాయన స్వయంగా తన కళ్లతో తాను అన్నీ చూడ వచ్చు. కాశ్మీర్ ప్రజల అభిప్రాయ ప్రకటనకి ఐక్య రాజ్యసమితి అణు మాత్రమైనా విలువ యిచ్చినట్లయితే, కాశ్మీర్ ప్రజల అభిప్రాయం ఒక్కటే యీ సమస్యాపరిష్కారం విషయంలో లెక్కలోకి తీసుకోబడుతుందని ఐక్య రాజ్య సమితి పదేపదే చేసిన ప్రకటన నిజంగానే చిత్తశుద్ధితో కూడు కున్నదే అయితే, డాక్టర్ గ్రాహాం తిరిగి వెళ్లి ఉపయోగకరమైన నివేదిక సమితికి యివ్వవచ్చు. ఈ విధంగా అయన ఐక్య రాజ్యసమితికి నిజంగా సేవచేసినవాడయి, కాశ్మీర్ ప్రజల అభిప్రాయం ఎటుమొగ్గుతున్నదో సమితి వారికి తెలియచెప్పవచ్చు.

డాక్టరు కుంజ్రూ ఒక ప్రశ్న వేస్తున్నారు : కాశ్మీర్ రాజ్యాంగ పరిషత్తు అంటే పాకిస్తాన్ ఎందువల్ల భయపడుతున్నదని. ఐక్య రాజ్య సమితి నిర్ణయాలను మన్నించడం విషయంలో కాశ్మీర్ రాజ్యాంగ పరిషత్తు నిర్ణయాలు ఏవిధంగాను అడ్డురావడం జరగదని ఇండియా ప్రభుత్వం అనేకసార్లు హామీ యిచ్చి స్పష్టం చేసింది. అయినా పాకిస్తాన్‌కి భయం దేనికి ? ఈ విషయంలోని సందేహాలను నివృత్తిచేసి, నే నిప్పుడు పాకిస్తాన్ ఎందుకు జంకుతున్నదో వివరించ దలుచుకున్నాను. ఇండియా ప్రభుత్వం కావించిన పై ప్రకటన పాకిస్తాన్‌కు తెలియనిది కాదు. అయితే వాళ్లకి వాస్తవిక పరిస్థితి ఏమిటో అదికూడా తెలుసు. వాళ్లు యింత తీవ్రంగా ప్రతిఘటించి, వీలు లేదని నెత్తీ నోరూ కొట్టుకుం టున్న యీ ప్లెబిసైటు ఫలితం ఏ విధంగా ఉంటుందో వాళ్లకి తెలియక పోలేదు. అందుకే యీ ప్లెబిసైటు కార్యరూపం దాల్చడాన్ని వాళ్లు ప్రతి

ఘటిస్తున్నారు. దురాక్రమణలో ఉన్న కాశ్మీర్ భూభాగం అంతాపూర్తిగా దుండగీడుల చేతులనుండి విడిపించేదాకా ప్లెబిసైట్ జరపబడదని వారికి తెలుసు; రావల్పిండి మొదలైన చోట్ల ప్రస్తుతం నిరాశయులై తిరుగుతున్న కాశ్మీరీయులంతా తిరిగి స్వస్థలాలలో పునరావాసులుగా చేయబడే వరకూ ప్లెబిసైట్ జరగడం అసంభవమని వారికి తెలుసు. ప్రస్తుతం ఢిల్లీనుండి జమ్మూ, శ్రీనగర్ వరకూ ఉన్న ప్రదేశం అంతటా చెల్లాచెదరై ఉన్న కాశ్మీర్ నిర్వాసులు తిరిగి కాశ్మీర్‌లో తమ తమ స్వస్థలాలలో నెలకొల్ప బడేటంతవరకూ ప్లెబిసైట్ జరగనేరదని పాకిస్తాన్‌కు తెలుసు. ఇంకా వారికి తెలుసు: ఉత్తర భూభాగాలూ, ప్రస్తుతం "ఆజాద్ కాశ్మీర్" అని పిలువబడే ప్రాంతం, యివన్నీ కాశ్మీర్ ప్రభుత్వం అధీనంలోకి వచ్చేటంతవరకూ ప్లెబిసైట్ జరగనేరదని. పైన వివరించిన వన్నీ జరిగేవరకూ ప్లెబిసైట్ జరగదు. ఈ విషయాలన్నీ వాళ్ళకి పూర్తిగా అవగాహన అయాయి. అందువల్లనే యీ ప్లెబిసైట్ అన్నది జరగదని, జరగనేరదని, వాళ్ళకి పూర్తిగా తెలుసు. ఇక పోగా, లెక్కలోకి తీసుకోవలసినది రాజ్యాంగ పరిషత్తు నిర్ణయం. ఆ పరిషత్తుకే ఎన్నికలు జరగనున్నవి. జరగవలసిన కాలం జరిగాక, సకాలంలో ఐక్యరాజ్య సమితిగాని, తక్కిన ప్రపంచంగాని, వాస్తవికతను ముఖాముకం ఎదుర్కొని ఒక సత్యం అంగీకరించవలసివస్తుంది: ఇండియా—పాకిస్తాన్ దేశాలు రెండూ కలిసి నిర్ణయానికి ఒకదానికి రాలేకపోయాయి కనక, అదివరలో అనుకున్నమాదిరిగా ప్లెబిసైట్ జరిపించడానికి ఆస్కారం ఇక లేదని అంతా అంగీకరించవలసి ఉంటుంది. కాని, కాశ్మీర్ ప్రజల నిర్ణయం మాత్రం అక్కడ స్పష్టంగా ఉండనే ఉంటుంది, ఎది ఎలా ఉన్నా, ఆ నిర్ణయాన్ని సమూలంగా తోసి పుచ్చడం ఎ విధంగా వీలవుతుంది? ఈ నిర్ణయం ఏదో దైనందిన కార్య క్రమంలో జరిగినట్లు జరగదు. ఆ రకం నిర్ణయం ఎంతమాత్రం కాదది. కాశ్మీర్ ప్రజలు ఏదో వేడుకకోసం,

దీన్నొక సాంఘిక ఉత్సవంగా భావించి అందుకై ఎన్నికలు తలపెట్టలేదు. ఇండియా రాజ్యాంగ చట్టం 370 వ సూత్రం అనుసరించి కాశీర్‌కు రాజ్యాంగ పరిషత్తు నేర్పరచుకుని నిర్ణయాలు తీసుకునే హక్కు యివ్వ బడింది.

ఈ విధంగా ఇండియా రాజ్యాంగ చట్టం ప్రకారం, సమావేశం కానున్న కాశ్మీర్ ప్రజాపరిషత్తు తీసుకోబోయే నిర్ణయాలన్నిటికీ భారతదేశం యొక్క ఆమోదమూ, సహకారమూ, యీ పార్లమెంటుయొక్క ఆమో దమూ, సహకారమూ, పూర్తిగా ఉంటాయి. కాశ్మీర్ ప్రజల నిర్ణయాన్ని, భారత పార్లమెంటుయొక్క, కుహత్తరమైన యీ దేశపు రాజ్యాంగ చట్టం యొక్క పూర్తి ఆమోదాన్ని పొందే కాశ్మీర్ నిర్ణయాన్ని, ప్రపంచం తోసి పుచ్చగలదని మీరు భావిస్తున్నారా ? మన పాకిస్తానీ స్నేహితులు, వారి ఉన్మాదావస్థలోనైనా యీ విషయాన్ని అర్థంచేసుకోలేరని మీరు అనుకుం టున్నారా ? కాశ్మీర్ రాజ్యాంగ పరిషత్తు నిర్ణయాలు ఎంత ప్రాముఖ్య మైనదో వారు గ్రహించ లేరంటారా ? అందుచేత యీ విషయమై డాక్టర్ కుంబ్రా ఎట్టి ఆందోళనా పడనవుసరంలేదు, దీన్ని గురించి పాకిస్తానీ యులు అందోళన పడనివ్వండి : వారికి ఆందోళన ఉండడం సహజమే. ఆ మాటకొస్తే వారి భయాలు ఇంకా ఎక్కువవుతాయి. అందుచేతనే యిటు వంటి పరిస్థితిలో వాళ్లు మన రాజ్యాంగ పరిషత్తు ప్రయత్నాలను భంగపరి చేందుకు తమసేనల్ని పూంచ్‌కి తరవించుకు వచ్చారు. పరిషత్తు సమా యత్తాన్ని విచ్ఛిన్నం చేసే ఉద్దేశంతోనే " జెహద్ " నినాదాన్ని లేవదీసి బెదిరిస్తున్నారు. వాళ్లింకా చాలా పనులు — రహస్యంగానూ, బాహాటం గానూ—చేశారు. కాని వాళ్ల కుయుక్తులన్నీ భగ్నం అయాయి. వాళ్లు పాకిస్తాన్ ప్రజల్ని ఉద్రిక్తుల్ని చేసి రెచ్చకొట్టారు. వారి ప్రయత్నాలను మనం అరికట్టి ఉండలేకపోయినట్లయితే, వాళ్ళు చాలా దుష్కార్యాలు యీపాటికి చేసి ఉందురనడానికిసందేహం లేదు. ఎంచేదంటే, యీ

దుష్కృత్యంలో పాకిస్తాన్ ఒంటరిగా లేదని మనకు తెలుసు : దాని వెనక ఉండి కొన్ని దేశాలు తాళం వేస్తున్నాయి. కొందరు దాని భుజంతట్టి" భళీ అంటున్నారు. పాకిస్తాన్ దురాశలను వాళ్లూ పంచుకుంటున్నారు. ఈ విషయాలు ఒక్క కాశ్మీర్‌కూ, ఇండియాకూ, సంబంధించినవి మాత్రమే కాదు. ఆసియా అంతటికీ సంబంధించిన సమస్య యిది. కాని, తాను కొట్టిన ప్రతి దెబ్బకీ తిరిగి రెండు దెబ్బలు తినవలసి ఉంటుందని ఎప్పుడయితే గ్రహించిందో, అప్పటినుండీ తగ్గింది.

ఏది ఎలా ఉన్నా ఇండియా ప్రభుత్వం యీ విషయంలో చేసిన అపారమైన త్యాగానికి నా వందనసమర్పణ. ఈ సందర్భాన్ని పురస్కరించుకుని యింకొకటి పునరుద్ఘాటిస్తున్నాను. రాబోయే కాశ్మీర్ ఎన్నికలు న్యాయబద్ధంగా, నిష్పాక్షికంగా ఉంటాయి. ఒకవేళ పాకిస్తాన్ వాళ్ళుగాని, ఐక్య రాజ్య సమితి వాళ్ళుగాని, యీ ఎన్నికలకు యివ్వవలసిన ప్రాముఖ్యాన్ని యివ్వడానికి యిష్టం లేక, ఎన్నికలు జరుగుతున్నపుడు చూడడానికి రాకపోతే, కనీసం యీ పార్లమెంటులోని మిత్రులను రమ్మని ఆహ్వానిస్తున్నాను. సమావేశం జరుగుతూండగానే వచ్చి చూడండి. మీకు సంతృప్తినిచ్చే సల్లక్షణాలు అక్కడ మీరు అవలోకించి తీరుతారని హామీ యిస్తున్నాను.

ఇక కాశ్మీర్‌మీద, లేదాయింక ఇండియాయొక్క ఏ యితర భూభాగంమీద, పాకిస్తాన్ దడి చెయ్యడం, యుద్ధం చెయ్యడం గురించి ఆలోచిస్తే అటువంటిది జరగనేరదని నా నమ్మకం. అటువంటి పరిస్థితికి అవకాశం మించిపోయింది. అటువంటి ప్రమాదం తీసుకువచ్చే పరిస్థితి పూర్తిగా దాటిపోలేదని కొందరు అనుకోవచ్చు. కాని, మా కాశ్మీర్ ప్రజలకు సంబంధించినంత వరకూ—మేము కడుచేరువలో ఉన్నవాళ్ళం కాబట్టి—యుద్ధం సంభవమనే పరిస్థితి దాటి పోయిందని మాకు తెలుసు. ఇక ముందు ఆ ప్రమాదం లేనేలేదు. అంతమాత్రం చేత మన ప్రమత్తులుగా

ఉంది వెనక్కి చేరబడి విశ్రాంతి తీసుకోగలమని అర్థంకాదు. ఓకానొ కప్పుడు అనుకొన్నట్లు సైన్య బలగాల్ని తగ్గించి ఉంటే, అది చాలా అవి వేక చర్య అయేది. డాక్టర్ కుంజ్రూతో నేను యీ విషయంలో పూర్తిగా ఏకీభవిస్తూ, శాశ్వతంగా కాకపోయినా, కొన్నాళ్ళపాటు మనం అటువంటి ప్రయత్నాల్ని వాయిదా వేయవలసి ఉంటుంది.

సైన్య బలగాల్ని గురించి ప్రస్తావిస్తూ, వాటిమీదపెట్టే ఖర్చు ప్రత్యామ్నాయంగా మనకేమీ లబ్ధి తీసుకువచ్చేది కాదని డాక్టర్ కుంజ్రూ అన్నారు. ఇక్కడ నేను అయినతో ఏకీభవించను. ఇండియా సైన్యంతో మాకున్న అనుభవాన్ని బట్టి—కాశ్మీర్ ప్రజలకు ఉన్న అనుభవం కంటె దేశంలో యింకేభాగంవారికీ ఎక్కువ అనుభవం ఇండియా సైన్యంతో ఉండదు—తన సైన్యాలను తలచుకుని ఇండియా సకారణంగా గర్వపడ వచ్చునని మా నమ్మకం. కాస్త మీరు ప్రయత్నించి ఇండియా సైన్యాలు కాశ్మీర్‌లో ప్రవేశించిన సమయమూ, పరిస్థితీ, ఎటువంటివో జ్ఞాపకానికి తెచ్చుకోగలరు. ఈ మూలనుండి ఆ మూలవరకూ దేశం యావత్తూ అట్టుకిపోయిన స్థితిలో ఉంది. బాగా చదువుకున్న ప్రాజ్ఞుల సైతం ఎందరో ఆ ఉద్రిక్తవాహినిలో పడిపోయారు : అపస్మారులైనారు. కెమ్ముకొనివచ్చే రుగ్మతను అరికట్టలేకపోయారు. ఇది పరిస్థితిలో ఒకభాగం మాత్రమే. ఇంకోపక్క చూస్తే, ప్రత్యక్ష నరకంవలె తయారయి మతోద్రేకాలతో కుతకుత ఉడుకుతున్న పంజాబ్ గడ్డమీదుగా ఇండియా సైన్యాలు వెళ్ళవలసివచ్చింది. వీటితో జతపరచి, కాశ్మీర్‌పై సాగిన దుండగీండ్రు ఎటువంటివారో అదికూడా ఆలోచించండి. మన సైనికులలో అనేకుల యిళ్ళనూ, ఆస్తులనూ దోపిడీ చేసిన దుండగీళ్ళే ఆ దుండగీళ్ళు. ఇంకా చూడండి : దుండగీళ్ళకు దారిలోనే ఉన్న రావల్పిండి, గుజ్‌రన్‌వాలా జిల్లాలకు చెంది యిళ్లూ వాకిళ్లూ ఉన్న మనసైనికులలో అనేకుల దుర్భర పరిస్థితి ఆలోచించండి. ఇంకా ఉంది. శత్రువెవరో, మిత్రుడెవరో తెలిసి

కోడానికి అవకాశం లేనిఘడియల్లో ఇండియా సైన్యాలు కాశ్మీర్‌లో అడుగుపెట్టాయి. పైకి చూస్తే అంతా పంచి ముస్లిములవలనే గోచరించారు. ఆలోచించండి: నాలుగు సంవత్సరాల క్రితం హిందువులు ముస్లిములూ, ముఖాముఖం ఎదురవడం అంటే ఏమిటో ఊహించిచూడండి ఆరోజుల్లో. ముస్లిము అయితే చాలు, వాడు తనకు గర్భ శత్రువు అని హిందువుడు భావించేవాడు. అదే విధంగా, హిందువు అన్న ప్రతివాడూ తనకు పరమ శత్రువని ముస్లిము స్థిరం చేసుకునేవాడు. ఇండియా సైన్యాలు కాశ్మీర్‌లో అడుగు పెట్టిననాటి పరిస్థితులవి. వారి చింతనలో మెదిలినది ఒక్కటే అభయం—గాంధీజీ అనుజ్ఞతోటీ, ఆశీర్వచనంతోటీ వాళ్ళక్కడ అడుగుపెట్టారు. ఏ సత్య సూత్రానికయితే గాంధీజీ జీవితం అంతా ధారపోశాడో, ఆ సూత్రాన్ని ఆచరణలో నిరూపించడానికి వాళ్ళు అక్కడికి పంపరాడ్డారన్న విషయంకూడా వాళ్ళకి జ్ఞాపకం ఉంది. హిందూ ముస్లిమ్ విభేదాలను రూపుమాపడమే ఆ సత్యసూత్రం. దాన్ని సాధించడానికే వాళ్ళు ఆదేశింపబడ్డారు. మతవైషమ్యం అనే విషబీజాన్ని నిర్మూలించడానికి వాళ్ళక్కడికి పంపబడ్డారనే విషయంకూడా స్పష్టం చేయబడింది. అంతేకాదు వాళ్ళు అక్కడ అడుగుపెట్టే వేళల్లో, వాళ్ళ మనస్సుల్లో యింకా మెదులుతూన్న జ్ఞాపకాలు—వికలాంగులైన తమ బంధువులు, తోడు నీడలు, దోచుకోబడ్డ తమ యిళ్ళు, వాకిళ్ళు—ఆదృశ్యాలన్నీ యింకా కళ్ళముందు కదులుతూనే ఉండగా – ఇవన్నీ వారివెంట ఉన్నవి. ఇండియా సేనలు కాశ్మీర్‌లో అడుగుపెట్టినప్పటి స్థితిగతులు అటువంటివి. మతవిషయంలో కాశ్మీర్‌లో ఉన్న పరిస్థితి వాళ్ళకి ఏమీ తెలియదు. షేక్ అబ్దుల్లా, నేషనల్ కాన్ఫరెన్సు, ప్రాతినిధ్యం వహించినది వేటికో వాళ్ళకు అప్పటికి తెలియదు. వాళ్ళు కాశ్మీర్ చేరుకున్న మొదటినాడు - ఏ రకం మనుషులతో వాళ్లు వ్యవహరించవలసి ఉంటుందో అక్కడ ఉన్న స్థితిగతులేమిటో—అంతా వాళ్లకి పూర్తిగా అగమ్య

గోచరం. అవన్నీ తరవాత వాళ్లకి తెలిసివచ్చాయి. ఇండియా సేనలు కాశ్మీర్‌నే చేరుకోవడానికి దాటివెళ్లవలసిన భూభాగం అటువంటిది! చేరుకున్నాక అక్కడ ఎదుర్కొన్న పరిస్థితి ఆ రీతిది. చేరుకున్న తరవాత వాళ్లు తమ విద్యుక్త ధర్మాన్ని శ్లాఘనీయమైన రీతిని నిర్వహించారు. అడుగుపెట్టీ పెట్టడం తోటే వాళ్లు తెలుసుకున్నదేమిటి? అంతవరకూ రావల్‌పిండినుండి అక్కడికి సరఫరా అవుతూ వచ్చిన ఉప్పు పాకిస్తాన్ అటకాయించి ఆపుసేసింది. తత్ఫలితంగా అక్కడి మనుషులూ, పశువులూ, విపరీతమైన యిబ్బందికిలోను కావలసివచ్చింది. ఇండియా పటాలపు సైనికులు తమ రేషనుతో తెచ్చుకున్న ఉప్పు అక్కడి ప్రజలతో కనిసి పంచుకుందికి వెనుదీయలేదు. ఇది చాలా చిన్న ఉదాహరణకావచ్చు: కాని ఇండియా సైనికుల శ్లాఘనీయ ప్రవర్తనను చక్కగా నిరూపిస్తుంది.

ఇంకోటికూడా నేను చెప్పవలసిఉంది. ఇండియా సైన్యంలోని ఆఫీసర్లు, యితర ఉద్యోగులు, వీళ్ళు తమ ప్రవర్తనలో చూపే సద్గుణాలు తరుచు ప్రజానీకంలో కూడా మనకు కనబడవు. ఇవాళ మీరు బ్లాక్ మార్కెటు దార్లతోనూ, లంచగొండి ఉద్యోగులతోనూ వేగలేక సతకుతం అవుతున్నారు. అంటే వీళ్లెవరు? దేశంకోసం కొంచెమయినా కష్టపడడానికిగాని, త్యాగం చెయ్యడానికి గాని, కష్టసమయంలో దేశానికి కాస్తయినా సహాయం చెయ్యడానికిగాని, యిష్టంలేనివాళ్ళన్నమాట. ఇటువంటి పరిస్థితులలో, తక్కిన వాళ్ళలో మనకు గోచరించే యీ అవినీతికరగుణాలు సంక్రమించని వర్గం సమాజంలో ఒక్క సైనిక శాఖమాత్రమే అని నాకు అనిపిస్తోంది. అత్యాశ, అసత్య ప్రవర్తన, కులమత వైషమ్యం—వీటికి అతీతులై అంటకండా దూరంగా ఉన్నవాళ్ళు యీ సైనికులు. తమదేశం పట్లా, దేశప్రజల పట్లా అత్యంతమైన అభిమానంతో ప్రవర్తించేవారు వీరు. అందుచేతనే, యుక్త వయస్సు వచ్చిన ప్రతి భారతీయుడూ సైనికుడుగా తయారయే సుదినం కోసం నేను ఎదురుచూస్తున్నాను. దేనికి? ఎవరినీ హింసించడానికిగాని,

దోపిడీ చెయ్యడానికిగాని, ఎంతమాత్రం కాదు. మనకు స్వాతంత్ర్యం సాధించడానికి మన జాతిపిత అవలంబించిన సూత్రానికే అది విరుద్ధం. జాతిపిత మనకు బోధించిన సూత్రాలకు విరుద్ధంగా మనం నడుచుకున్న నాడు, అది మన దేశపతనానికే ధారితీస్తుంది. మనమంతా సైనికులుగా, చేరి ఎద్దైనా ఇంకో దేశం మీదికి దాడివెడలడం (పాకిస్తాన్, బర్మా, చైనా) మన ఆశయంకాదు. అంతర్జాతీయంగా వివిధదేశాల మధ్య ఇండియా తలయెత్తుకు గౌరవపడంగా నిలుచోగల్గాలంటే, యిప్పుడే అభ్యుదయ పథంలో అడుగు పెట్టిన మన దేశం కొన్ని సద్గుణాలు అలవరచుకోవలి. ఆ సద్గుణాలు ప్రతిభారతీయునిలోనూ ప్రతిఫలించిన నాడే మనం అగౌరవం సాధించగలం. ప్రస్తుతం ఆ సద్గుణాలు ఒక్క మన సైనికులలోనే గోచరిస్తున్నవి. ప్రతి భారతీయుడూ సైనికుడుగా తయారవడం నేను అభిలషిస్తున్నాను అంటే, అదే కారణం. మన సైన్యాన్ని మనం తగ్గించి వేయనక్కరలేదు. నేడు మనకి మానవకృషి అవసరం ఏంతో వుంది. వ్యవసాయాన్ని అభివృద్ధిపరచడానికి, వివిధ వాణిజ్యాలను, పరిశ్రమలను ముందుకు తీసుకురావడానికి మనకి నేడు ఎందరో మనుషుల అవసరం ఉంది. ఈ రంగాల్లో మన సైనికుల్ని, మనం ఎందుకు వినియోగించ కూడదో నా కర్థం కాకుండా ఉంది. దేశం అంతటా అక్షరాస్యత విస్తరింప చేయవలసిన సమస్య మనం పరిష్కరించావి. ఈ కార్యాన్నే కనక మనం సైన్యానికి అప్పగిస్తే, వాళ్ళు ఆ పనిని అతి సామర్థ్యంతో నిర్వహించి అనతికాలంలోనే మన ప్రజానీకాన్ని యావత్తూ అక్షరాస్యుల్ని చేయగలరని నేను మీకు హామీ యిస్తున్నాను. ఆ విధంగానే వాళ్ళు మన ఆహార సమస్యకుకూడా అతి త్వరగా పరిష్కార మార్గం చూపగలరు. ఈ అవకాశాన్ని పురస్కరించుకుని సైనికశాఖలోని సోదరులందరికీ అభినందనలు తెల్పుతున్నాను—ముఖ్యంగా మన దేశపు పశ్చిమోత్తర సరిహద్దులను పరిరక్షిస్తున్న వారికి. నే నింతకుముందు మనవిచేసినట్లు, గౌరవనీయ

లైన డాక్టరుగారి ప్రసంగంలో ముఖ్యంగా ఒక హంశంతో నేను పూర్తిగా ఏకీభవించి నా పూర్తిసహకారాన్ని యిస్తున్నాను. అది ఏదంటే, కాశ్మీర్ భూభాగంలోని ఒక్క అంగుళం ప్రాంతం అయినా శత్రువులచేతిలో ఉన్నంతవరకూ మనం విశ్రమించరాదు. శత్రువుయొక్క దురాక్రమణ నిర్మూలించే చర్యలన్నీ మనం తీసుకోవాలి.

ఇండియా విభజన జరిగిన నాటినుండీ పాకిస్తాన్ ఒక వింత వైఖరిని అవలంబిస్తూ, పరిస్థితులను మితిమీరిన అవకాశం తీసుకుని, తన మైనారిటీ వర్గాలమీద దారుణమైన హింసాకాండ సాగిస్తున్నదని గౌరవనీయులయిన సభ్యుడు అన్నారు. దాని ఫలితం ఏమిటి? మనదేశంలో బాధ్యత నెరిగిన వర్గాలూ, ఇండియా ప్రభుత్వమూ, దేశంలో శాంతిని కాపాడడానికి ఎంతగా ప్రయత్నించి కృషిచేసినా, యిక్కడి మైనారిటీ వర్గాలలో కొంతలో కొంతయినా జంకు, ఆందోళన, పాకిస్తాన్ వైఖరి ఫలితంగా జనించక తప్పదు. ఈ పరిస్థితిని యింటా బయటా తనకనుకూలించేటట్లు పాకిస్తాన్ నేర్పుగా ఉపయోగించుకుంటోంది. ఈ చక్కని అవకాశం వాళ్ళు ఒకచెంప ఇండియాను నిందిస్తూనే యింకో చెంప తమదేశంలోని మైనారిటీ వర్గాలను తరుమగొట్టడానికి ఉపయోగించుకుంటున్నారు. ఇటువంటి దుర్మార్గ వర్తనకు ఒడిగట్టకండాపాకిస్తాన్‌ను ఆపుచెయ్యడానికి ఏం చెయ్యవలసిఉంటుందో మనం తీవ్రంగా ఆలోచించడం లేదు. పాకిస్తాన్ కనక అక్కడి కోటిమంది హిందువులను తరిమివేస్తే, మనంకూడా నాలుగు కోట్ల ముస్లిములను తరిమివేస్తామని అంటామా? అది మానవత్వానికే వ్యతిరేకం. భారత రాజ్యాంగ చట్టానికి వ్యతిరేకం. అంతేకాక, పాకిస్తాన్ అలాగయినా తన దుష్కృత్యాలను మానదు. ఎంచేతంటే మొతటినుండీ వారిది ఒకటే సిద్ధాంతం.లోగడ మిస్టర్ జిన్నా ఆ సిద్ధాంతం స్పష్టం చేశాడు కూడా. దేశవిభజన మూలంగా ఇండియాలో ఉండిపోవలసిన ముస్లిముల గతి ఎమిటని మిస్టర్ జిన్నాను ప్రశ్నించగా, తాణక్కడా

బెణక్కుండా ఆయన యిచ్చిన సమాధానం ఏమిటంటే, ఆరుకోట్ల తన మతస్థులకోసం తన మతస్థులే అయిన తక్కిన నాల్గు కోట్ల మందిని బలి యివ్వడానికి తనకభ్యంతరం లేదని. అంచేత నేటి పాకిస్తాన్ వాళ్ళకి యిది సమస్యకాదు. వాళ్ళకి సంభందించినంత వరకూ, యీ అధ్యాయం ముగిసింది: తమకేమీ యిందులో బాధ్యత లేదు. అంచేత, జిన్నాగారి వారసులనుండి నాలుగుకోట్ల ఇండియన్ ముస్లిములు నేడు ఆశించ వలసినది ఏమీ లేదు. పాకిస్తాన్‌లో వాళ్ళు ఒక విషయంగురించి స్పష్టమైన అభిప్రాయం కలిగి ఉన్నారు: తమదేశంలో ఉంటున్న కోటిమంది హిందువులను బయటకు తరిమేసి, వాళ్ళ ఆస్తి పాస్తుల్ని, సర్వస్వాన్నీ దోచేసుకుందినే నిశ్చయించారు. ఇక ఇండియాలో ఉన్న నాలుగుకోట్ల ముస్లిముల సంగతి వాళ్ళసలు ఆలోచించరు. వీళ్ళు చచ్చినా బతికినా వాళ్ళకక్కరలేదు. వీళ్ళ కర్మానికి వీళ్ళని వదిలేశారు.

కాశ్మీర్ సమస్య పరిష్కారానికి లొంగకపోతే ప్రపంచ శాంతికే ముప్పు రాగలదనే బెదరింపుతో యీ విషయంమీద రేగుతున్న కోలాహలం చూస్తూంటే నా కాశ్చర్యం వేస్తున్నది. ఇంతకూ యిటువంటి ప్రచారానికి అట్టడుగున ఉన్న అసలు కారణమేమిటి? పోనీ అనుకుంటే, ప్రపంచ శాంతికి భంగకరం కాగలిగినంత పెద్దదేశంకూడా కాదు కాశ్మీర్. అక్కడ నలభై లక్షల జనాభా మాత్రమే నివసిస్తున్నారు. ఒక కోటిమంది ప్రజలు పాకిస్తాన్‌నుండి తరిమివేయ బడుతున్నారు. దీనిప్రభావం ఇండియాలో ఉంటున్న ఇంకో నాలుగు కోట్ల ప్రజలపై ప్రసరించక తీరదు. ఈ రీతిగా ఒకచెంప యిలా అయిదారుకోట్ల ప్రజల జీవితాలు నాశనం అయితే చలించని ప్రపంచశాంతి, ఒక నలభై లక్షల కాశ్మీర్ ప్రజలవల్ల చలింపబడుతుందా? ఏ రీతిగా? ఇండియా ప్రభుత్వం బెదిరింపులకు లొంగక నిబ్బరంగా నిలబడి, పై విషయాన్ని ప్రపంచదృష్టికి తీసుకురావడానికి తక్షణమే పూనుకోవలసిఉంది.

---

—from inside front cover

పత్యంనుంచి అధికారాన్ని ప్రజలపరం చేయు టానికై వీరు ఆనాటినుంచి ఎంతో త్యాగంతో ప్రజల రాజకీయ చైతన్యాన్ని సంఘటన పఱచే ఉద్యమానికి తమ జీవితాన్ని అంకితం చేసుకున్నారు. వీరి ఆధ్వర్యంకిందనే 1939 లో ముస్లిము కాన్ఫరెన్సుకు నేషనల్ కాన్ఫరెన్సు అనే కొత్తపేరు పెట్టబడింది. ఈ సంస్థకు వీరు ప్రారంభంనుంచి కార్యదర్శిగా పనిచేస్తున్నారు. ఈనాడు కాశ్మీరులో అత్యంత బలీయమై, సుసంఘటితమైన సంస్థగా నేషనల్ కాన్ఫరెన్సు పని చేస్తోందంటె, అందుకు చాల మటుకు మౌలానా మహమ్మదు మసూదీగారే కారణం.

ఇండియన్ పార్లమెంటులో కాశ్మీరుకు ప్రాతినిధ్యం ఉండాలని నిర్ణయంజరిగినప్పుడు, మౌలానా మహమ్మదు మసూదీగారిని ఒక ప్రతినిధిగా ఎన్నుకున్నారు. 1951 ఆగస్టు 11వ తేదీన ఇండియన్ పార్లమెంటులో మౌలానా మహమ్మదు మసూదీగారిచ్చిన ఉపన్యాసంలోంచి ఇక్కడ ప్రకటిస్తున్న కొన్ని ఉపన్యాస భాగాలు కాశ్మీరు పట్ల పాకిస్తాన్ ప్రకటిస్తున్న హక్కులోని అసత్యాన్ని, పాకిస్తాన్ బెదిరింపుల నిరుపయోగాన్ని స్పష్టపరుస్తున్నది.